# నా గురించి ....

| | | |
|---|---|---|
| పేరు | : | **డాక్టర్ భూసురపల్లి వేంకటేశ్వర్లు** |
| జననం | : | 04-09-1955 |
| తల్లిదండ్రులు | : | శ్రీమతి సుబ్బరత్నమ్మ, 'లయబ్రహ్మ' శ్రీ భూసురపల్లి ఆదిశేషయ్య |
| జన్మస్థలం | : | మద్దిపాడు, ప్రకాశం జిల్లా. |
| విద్య | : | యమ్.ఎ.(తెలుగు) – ఆంధ్ర విశ్వవిద్యాలయం<br>పిహెచ్.డి – పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం |
| గురువులు | : | సాహిత్యరంగం – డాక్టర్ నాగభైరవ కోటేశ్వరరావు<br>సంగీతరంగం – పద్మశ్రీ హరిద్వార మంగళం , డాక్టర్ ఎ.కె. పళనివేల్ |
| వృత్తి | : | ప్రభుత్వ డిగ్రీ కళాశాల అధ్యాపకుడుగా మూడు దశాబ్దాలు పనిచేశాను. అసోసియేట్ ప్రొఫెసర్‌గా పదవీ విరమణ చేశాను. |
| నివాసం | : | యస్.వి.యన్. కాలనీ, 6వ లైను, గుంటూరు. |
| విశేషాంశం | : | డోలు, ఘటం, కంజీరా వాద్యాల్లో ఉన్నతశ్రేణి కళాకారుడుగా గుర్తింపు పొందడం. |
| రచనలు | : | **1. తెలుగుసాహిత్య రూపకాలు – సమగ్ర పరిశీలన**<br>పిహెచ్.డి. పట్టా కోసం తెలుగు విశ్వవిద్యాలయంలో సమర్పించిన పరిశోధక వ్యాసం.<br>ఈ అంశంలో అంతకు ముందుగాని తరువాతగాని మరెవ్వరూ పరిశోధన గాని, కనీసం ఒక్క వ్యాసం రాయడం గానీ చెయ్యలేదు. |

2. **ఆంధ్రప్రదేశ్ నాదస్వర డోలు కళాకారుల చరిత్ర - 1986**

ఆంధ్రదేశంలో బహుజన వర్గాలకు చెందిన మంగలి, కుమ్మరి, దూదేకుల సామాజిక వర్గాలకు చెందినవారు ఈ నాదస్వర డోలు వాద్యాలలో కృషిచేసి గొప్ప విద్వాంసులైన వారున్నారు. అయితే చదువు లేకపోవడం వలన వారికి సారస్వత రంగంలో అతి తక్కువ స్థానం మాత్రమే లభించింది. అంతేకాదు సంగీతానికి చెందిన గ్రంథాల్లో కూడా వారికి అసలు స్థానం దక్కలేదు. నేను శ్రమించి ఆ వాద్యాల పుట్టుపూర్వోత్తరాలు పరిశీలించి ఒక చరిత్రని నిర్మించడమేగాక ఊరూరా తిరిగి దాదాపు 250 మంది ఆంధ్రదేశ కళాకారుల్ని కలిసి, వారి చరిత్రలు సేకరించి ఈ గ్రంథంలో నిక్షిప్తం చేశాను. ఈ గ్రంథం వలన అన్ని శుభాలకూ ముందు నిలిచే నాదస్వర డోలు కళాకారులకు చారిత్రక భూమిక ఏర్పడడమేగాక బహుజన వర్గాలకు చెందిన 250 మంది కళాకారులకు చరిత్ర సమకూర్చగలిగినాను.

3. **దేవులపల్లి కష్ణశాస్త్రి - 1996**

కేంద్రసాహిత్య అకాడమీ వారు నాచే కృష్ణశాస్త్రిగారిపై మోనోగ్రాఫ్ రాయించినారు. కేంద్ర సాహిత్య అకాడమీ ప్రచురించింది. తెలుగులో ఇప్పటికి నాలుగు ముద్రణలు పొందింది. భారతదేశంలో అన్ని అధికార భాషల్లోకి, ఆంగ్లం లోకి అనువాదాలు పొందగలిగింది.

4. **నేతాజీ.... (నవల)**

1985 ప్రాంతంలో ఒరిస్సాలో + 2 విద్యకి ఉపవాచకంగా నిర్ణయించబడింది.

5. **ఒక అనుభవం నుంచి (కవితాసంపుటి) ..... 2003**

స్వీయకవితల సమాహారం

6. **స్నేహగీతాలు (కబీర్ అనువాదం) .....2012**

కబీరు దోహాలకు పద్యానువాదం 508 పదాలతో సామాజిక అంశాలతో కూడిన గ్రంథం.

7. **నాన్నకోసం... (కవితాసంపుటి) ..... 2017**

మా నాన్న గొప్ప డోలు విద్యాంసులు. వారి స్మృతిలో నేను రాసిన కవితలతో ముద్రించిన కవితా సంపుటి. ఈ గ్రంథానికి రాజమహేంద్రవరం తాతారావు స్మారక పురస్కారం లభించింది.

8. **బాలమురళీకృష్ణ (వ్యాస సంపుటి) .......... 2018**

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారు డాక్టర్ మంగళంపల్లి బాలమురళీకృష్ణ మరణానంతరం ఆయన పేరుతో జాతీయ పురస్కారం నెలకొల్పి తొలి పురస్కారాన్ని శ్రీ అన్నవరపు రామస్వామిగారికి ఇచ్చారు. ఆ సమయంలో ఆంధ్రప్రదేశ్ భాష సృజనాత్మకత మరియు సంస్కృతి శాఖ నాచే అన్నవరపు రామస్వామి, మంగళంపల్లి బాలమురళీకృష్ణ గార్లపై జీవితచరిత్ర వ్యాసాలను రాయించి ఒక గ్రంథంగా ముద్రించారు.

9. **నేత్రధ్వని (కవితాసంపుటి) ........ 2018**

స్వీయకవితల సమాహారం

10. **ప్రవాహశిల్పం (కవితాసంపుటి) ..... 2019**

స్వీయకవితల సమాహారం

11. **ప్రముఖ వాగ్గేయకారులు – (అమరావతి ప్రచురణలు) ... 2016**

కర్నాటక సంగీతంలో ప్రముఖులైన దాదాపు 50 మందికి పైన తెలుగు వాగ్గేయకారుల గురించి రాసిన పరిశోధనాత్మక గ్రంథం. ఇంతకు ముందు వాగ్గేయకారుల గురించి రాసిన వారెవ్వరూ చెయ్యని 'యుగ విభజన' ప్రవేశపెట్టాను.

12. **తెలుగు వారి మంగళవాద్య ప్రాభవం–నాదస్వరం ...... 2012**

– తెలుగు అకాడమీ, ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక వ్యవహారాల సంయుక్త ముద్రణ

నాలుగవ ప్రపంచ తెలుగు మహాసభల ప్రచురణ

13. **తెలుగు వారి మంగళవాద్య కళా ప్రాభవం – డోలు ..... 2012**

తెలుగు అకాడమీ – ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక వ్యవహార శాఖ సంయుక్త ముద్రణ

నాలుగవ ప్రపంచ తెలుగు మహాసభల ప్రచురణ

14. **సమీకరణం (వచనకవితా సంపుటి) ......2022**

స్వీయ కవితల సమాహారం మరియు 'సమీకరణం' అనే వచన కావ్యం (12 భాగాలు)

15. **దగ్ధగోళం (దీర్ఘ వచనకావ్యం) ....... 2023**

ముద్రణలో :

16. **అమ్మ తలపులో (కవితా సంపుటి)**

17. **ఆంధ్రుల జానపదకళలు**

ఆంధ్రదేశంలో గత రెండు శతాబ్దాలలో ప్రాచుర్యంలో వున్న జానపద కళల గురించి పరిశోధక వ్యాసాలు.

అముద్రిత రచనలు :

18. **చిత్రశాల (చారిత్రక నవల)**

19. **త్యాగరాజు (చారిత్రక నవల)**

20. **గురు లేక ఎటువంటి...** (ఆకాశవాణి సంగీత రూపకం)

– విజయవాడ ఆకాశవాణిలో ప్రసారమైంది.

21. **నాదనామక్రియ** (ఆకాశవాణి సంగీత రూపకం)

– విజయవాడ ఆకాశవాణిలో ప్రసారమైంది.

22. **కృష్ణా తీరం – సంగీత ప్రాశస్త్యం** (పరిశోధక వ్యాసం)

23. **విశ్వనరుడు, కవయిత్రి మొల్ల** సాహిత్య రూపకాలు ప్రదర్శించడం జరిగింది.

పరిశోధనలో :

24. **ఆంధ్రుల సంగీత చరిత్ర** (3 భాగాలుగా సాగుతున్నది)

25. **తెలుగు సాహిత్యంలో లయాత్మకత**

## పొందిన అవార్డులు – సన్మానాలు

1. శ్రీ స్వామి చిన్మయానంద నుంచి హరిద్వారం లో 'సరస్వతీపుత్ర' బిరుదు పొందడం –(అనంతరం మద్దిపాడులో నాదస్వర డోలు కళాకారుల చరిత్ర ఆవిష్కరణ వేదికపై చిన్మయామిషన్ ప్రధానాచార్యులు స్వామిని శ్రీ శారదాప్రియానంద ఆ బిరుదుని ఫలకం చేసి తెచ్చారు. ఆ సభలో డాక్టర్ పుట్టపర్తి నారాయణాచార్యుల వారుండడం యాదృచ్ఛిక ఘటన.) – 1986

2. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఉత్తమ అధ్యాపక పురస్కారం – 1994

3. 'పర్యూజన్ ఇండియా' కార్యక్రమంలో ఉస్తాద్ జాకీర్ హుస్సేన్‌తో పాటు పాల్గొన్నందుకు ఢిల్లీ 'ఇండియన్ హాబిటేట్ సెంటర్' లో అప్పటి ప్రధాని గౌ॥ పి.వి. నరసింహారావు గారితో విశిష్ట ప్రభుత్వ పురస్కారం – 1995

4. ప్రపంచ తెలుగు సమాఖ్య ద్వితీయ మహాసభలో (హైదరాబాద్) ప్రత్యేక సాహిత్య పురస్కారం (డా. బెజవాడ గోపాలరెడ్డి, గవర్నర్ కృష్ణకాంత్ గార్లచే) – 1996

5. బొంబాయి అఖిలభారత తెలుగు మహాసభల్లో ప్రత్యేక సాహిత్య పురస్కారం (డా. వావిలాల గోపాలకృష్ణయ్య గారిచే) – 1997

6. ఆచార్య ఆత్రేయ స్మారక కళాపురస్కారం (ఒంగోలు) – 1997

7. డాక్టర్ నాగభైరవ సాహిత్యపీఠం ప్రతిభాపురస్కారం – 1998

8. నటరాజ లలితకళా సమాఖ్య మార్కాపురంవారి లలితకళా పురస్కారం - 1999

9. చెన్నై ఆంధ్రా క్లబ్ 'ఆస్థానం' ఆవరణంలో 'వేదిక' సాహితీ సాంస్కృతిక సమాఖ్యవారు ప్రత్యేక సత్కారం నిర్వహించారు. యస్.పి. బాలసుబ్రహ్మణ్యం గారి అధ్యక్షతలో వెన్నెలకంటి రాజేశ్వరప్రసాద్ నిర్వహణలో సాగిన ఈ సభలో దర్శకుడు కె. విశ్వనాథ్‌గారు, అల్లు రామలింగయ్యగారు, గొల్లపూడి మారుతీరావుగారు అతిథులుగా పాల్గొని సన్మానించారు. శ్రీ పప్పు వేణుగోపాలరావు, శ్రీ భువనచంద్ర నా గురించి మాట్లాడటం మరువలేని సంఘటన - 1999

10. తెలుగు సాహిత్యసమితి (చెంబూర్) బొంబాయి వారిచే గౌరవ సత్కారం - 1999. అదే సభలో నాచే గురజాడ స్మారకోపన్యాసం.

11. ఆ మరునాడే బాబా అటామిక్ రీసెర్చ్ సెంటర్‌లో నాచే రాజా రామన్న స్మారక ఉపన్యాసం. చైర్మన్: ఆర్. చిదంబరం చేతులమీదుగా సత్కారం - 1999.

12. ఢిల్లీ ఆంధ్రా అసోసియేషన్ వారిచే తెలుగు ప్రతిభా పురస్కారం (గౌ॥ ముప్పవరపు వెంకయ్యనాయుడు గారిచే) - 2000. డా॥ వి. కృష్ణమూర్తి, డా॥ కె.జి.రావు ఈ కార్యక్రమం నిర్వహించారు.

13. వెలిది వెంకటేశ్వర్లు యువచైతన్య విజ్ఞానవేదిక జాతీయ కవిత్వ పోటీలో ప్రథమ బహుమతి - 2001.

14. హిందీ ప్రేమ మండలి మహావిద్యాలయం, తెనాలిలో పూర్వ విద్యార్థులచే ఆత్మీయ సత్కారం - 2002.

15. జాన్ రాఘవయ్య జాతీయ విద్యా పురస్కారం 2001.

16. నాదబ్రహ్మ కళానిలయంవారిచే 'వినయభూషణ' బిరుదు ప్రదానంతో గౌరవసత్కారం - 2008.

17. సంగీత విద్వాన్ శ్రీ పోరూరి నరసింహారావు స్మారక పురస్కారం (హైదరాబాద్) - 2008.

18. తిరుపతిలో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభలలో ముఖ్యమంత్రి గౌ॥ శ్రీ కిరణ్‌కుమార్‌రెడ్డి గారిచే విశిష్ట సత్కారం - 2012.

19. చిలకలూరిపేట కళానిలయం వారిచే “సంగీత విజ్ఞాన్” పురస్కారం - 2013.

20. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం కీర్తి పురస్కార - 2013.

21. కొండూరి ఛారిటబుల్ ట్రస్ట్, హైదరాబాద్ వారిచే కవయిత్రి మొల్ల సాహిత్య పురస్కారం - 2014.

22. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి గౌ॥ శ్రీ నారా చంద్రబాబునాయుడుగారిచే గోదావరి పుష్కర ప్రత్యేక కవి సన్మానం - 2017.

23. ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం (ఫౌండేషన్ డే) ప్రతిభా పురస్కారం - 2015.

24. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి గౌ॥ శ్రీ నారా చంద్రబాబునాయుడుగారిచే సంగీత సాహిత్య రంగాలలో ఉగాది ప్రతిభా పురస్కారం - 2016.

25. గుంటూరులోని ఆరు సంస్థలు కలిసి ప్రతిభామూర్తులు పేరుతో పురస్కారం యిచ్చి సత్కరించారు - 2016.

26. సిలికానాంధ్రవారు 5000 మంది కళాకారులతో జరిపిన కన్వెన్షన్ కార్యక్రమంలో కేంద్రమంత్రి శ్రీమతి దగ్గుబాటి పురంధరేశ్వరిగారిచే ప్రత్యేక సన్మానం - 2017.

27. గాయత్రీ మహిళా సంగీత సన్మండలి వారి ఆత్మీయ పురస్కారం - 2017.

28. ఠాగూర్ ఎడ్యుకేషన్ సొసైటీ (గుంటూరు జిల్లా నాయీబ్రాహ్మణ సంఘం) వారి ఆత్మీయ సత్కారం - 2017.

29. “స్పిక్ మేకే” అంతర్జాతీయ కళాసంస్థ వారిచే పాల్ఘాట్ మణిఅయ్యర్ స్మారక పురస్కారం - 2017.

30. ఒంగోలు కళామిత్ర జాతీయ పురస్కారం - 2017.

31. జి.వి.ఆర్ కల్చరల్ ట్రస్ట్ హైదరాబాదు వారి సాహిత్య ప్రతిభా పురస్కారం - 2018.

32. కొంపల్లి బాలకృష్ణ జాతీయ సాహిత్య పురస్కారం - 2018.

33. రాజమహేంద్రవరం జి. తాతారావు విశిష్ట సాహిత్య పురస్కారం - 2018.

34. శ్రీకృష్ణదేవరాయ సాహిత్య సాంస్కృతిక సేవాసమితి, ఒంగోలు వారి జాతీయ పురస్కారం – 2018.

35. సృజన తొలి ఆత్మీయ పురస్కారం (అద్దంకి) – 2018.

36. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ అత్యున్నత పౌర పురస్కారం 'హంస – కళారత్న' పురస్కారం – 2018.

37. నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ (NIT, వరంగల్) మాతృభాషా దినోత్సవ పురస్కారం – 2019.

38. కవిసంధ్య 'శిఖామణి' సాహిత్య పురస్కారం, యానాం 2019.

39. స(ర్రాజు వేణుగోపాలరావు స్మారక ఉత్తమ ఉపాధ్యాయ పురస్కారం, గంటూరు – 2021.

40. అభినయ (ఒంగోలు) వారి వార్షికోత్సవ పురస్కారం – 2022.

41. యువకళావాహిని (హైదరాబాద్) వారి 'అమరావతి తెలుగు వెలుగులు' పురస్కారం – 2022.

42. అఖిలభారత వాద్యకళాకారుల సంఘ వార్షికోత్సవ (హైదరాబాద్) ప్రత్యేక సన్మానం – 2022.

43. వికాసాంధ్ర సాహితీ సాంస్కృతిక వేదిక (వికాసం) బరంపురం, ఒడిస్సావారి స్వర్ణోత్సవ ప్రత్యేక పురస్కారం – 2022.

44. శ్రీ రావి రంగారావు జనరంజక కవి ప్రతిభా పురస్కారం – 2023.

45. నవ్యాంధ్ర రాష్ట్ర రచయిత్రుల సంఘం (నరసం) నాలుగవ వార్షికోత్సవ ప్రత్యేక సత్కారం, కర్నూలు – 2023.

46. నెల్లూరు జిల్లా రచయితల సంఘం, శోభకృత్ ఉగాది ప్రత్యేక పురస్కారం.

## విశేషాంశాలు

1. 'భారతరత్న' యమ్మెస్ సుబ్బులక్ష్మి , 'పద్మవిభూషణ్' డా.మంగళంపల్లి బాలమురళీకృష్ణ , 'పద్మశ్రీ' మాండొలిన్ శ్రీనివాస్ వంటి గొప్ప విద్వాంసులందరికీ యాభై సంవత్సరాలుగా సహకారవాద్యం ఘటం వాయిస్తున్నాను.

   ప్రసారభారతి లో ఉన్నతశ్రేణి పొంది, అఖిలభారత సంగీత కార్యక్రమాలు, ఆకాశవాణి సంగీత సమ్మేళనం వంటి ప్రతిష్టాకరమైన కార్యక్రమాల్లో పాల్గొన్నాను.

2. అద్దంకి లో 'సృజన' అనే పేరుతో ఒక సాహిత్య సంస్థను నేనే, మా యింట్లోనే ప్రారంభించాను. ఆ సంస్థ దినదిన ప్రవర్ధమానం పొంది ఈనాడు ఉభయ రాష్ట్రాల్లోనూ అత్యంత ఆరోగ్యకరమైన సాహిత్య సంస్థగా విరాజిల్లుతున్నది.

మేము "తొలి తెలుగు పద్యమయ అద్దంకి పండరంగని శాసనం" ప్రతికృతిని పునఃప్రతిష్ఠ చేశాము.

తెలుగు భాష క్లాసికల్ లాంగ్వేజ్ చేసే ప్రస్థానంలో కోర్టులో ఈ శాసనం ఎగ్జిబిట్‌గా పనిచేసింది. భాషాసేవ విషయంలో మా శ్రమ ఫలించిందనుకుంటున్నాము.

3. విద్యార్థులను ప్రోత్సహించి, వారిచేత కవితలు రాయించి నేను పరిష్కర్తగా రెండు పుస్తకాలు (కవితా సంకలనాలు) ముద్రించాను.

   1. చిరుదివ్వెలు (చేబ్రోలు ప్రభుత్వ కళాశాల విద్యార్థులు)
   2. స్వాతిచినుకులు (అద్దంకి కళాశాల విద్యార్థులు)

4. సిలికానాంధ్ర వారు 5 వేల మంది కళాకారులతో మంగళవాద్య కన్వెన్షన్ జరిపినారు. ఈ కార్యక్రమం నా నిర్వహణలో జరిగింది. దీనికి 4 గిన్నిస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డులు వచ్చాయి.

5. ప్రకాశం జిల్లా రచయితల సంఘానికి తొలినుంచి (1973) కార్యవర్గ సభ్యుడుగాను, 1990 నుంచి నాలుగేళ్ళపాటు ప్రధాన కార్యదర్శిగాను పనిచేశాను.

చిరునామా :

**డాక్టర్ భూసురపల్లి వేంకటేశ్వర్లు**

302, విజయశ్రీ రెసిడెన్సీ

6/3, యస్.వి.యన్. కాలనీ

గుంటూరు - 522 006

సెల్ : 9848361627

